శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# 74 మంది సింహాసనాధిపతులలో
# కొందరి ఆచార్యుల వైభవమ్



యేరి-కాత్త రామర్, మధురాంతకం



'పండితరత్న' డా|| ఉ.వే.ఈయుణ్ణి అప్పగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు




ఎంపెరుమానారులు వ్రాసిన విషయాలను ప్రచురింపచేయటం కోసం 74 సింహాసనాధిపతులను ఏర్పాటు చేశారు

# విషయ సూచిక

# 74 మంది సింహాసనాధిపతులలో
# కొందరి ఆచార్యుల వైభవమ్

## 2) పుండరీకులు

తనియన్

**శుచౌ మాస్యుత్తరాషాఢా జాతం పూర్ణగురోస్సుతమ్,**
**యతిరాజాంఘ్రిసద్భక్తం పుండరీకాక్షమాశ్రయే.**

వీరు పెరియనంబి కుమారులు. అత్తుళాయ్. సహోదరులు. వీరు ఆషాఢ మాసం ఉత్తరాషాడ నక్షత్రంలో జన్మించారు. వీరు రామానుజుల శిష్యులు. వీరు ఒక సమయంలో వెళ్ళకూడని చోటికి వెళ్లారు అప్పుడు రామానుజులు వీరిని వెదకి పట్టుకొని సంస్కరించి దారిలో పెట్టారు.

## 3) తెఱ్ఱ్కాళ్వాన్

తనియన్

**కర్కటే శ్రవణే జాతం రామానుజపదాశ్రితమ్**
**కాశ్యపాన్వయసంభూతం నారాయణగురుం భజే.**

వీరు తిరు క్కోట్టియూర్ నంబి కుమారులు. ఆషాఢ మాసం శ్రవణా నక్షత్రంలో జన్మించారు. వీరిది కాశ్యప గోత్రం. వీరి సహోదరి దేవకి పిరాట్టి. వీరి మనుమలు తెఱ్ఱ్కాళ్వాన్ భట్టర్ శిష్యులు. వీరిని గురించి ఒక వృత్తాంతం ఉన్నది తిరుక్కోట్టియూర్లో కోళరి ఆళ్వాన్ అనే ఒకరు వీరి స్నేహితులు. కోళరి ఆళ్వాన్ చాలా ఆచార వంతులు తెఱ్ఱ్కాళ్ వాన్ కు అంత ఆచారం లేదు ఒక పుణ్య తిథినాడు తెఱ్ఱ్కాళ్వాన్ స్నానం చేయలేదు. దీనిని చూసిన కోళరి ఆళ్వాన్ " ఈనాడైనా స్నానం చేసి పాపాన్ని పోగొట్టుకోకూడదా?" అని అన్నారు అపుడు " మన పాపాలు ఒక మునక, రెండు మునకలతో పోయేది కాదు. సింగప్పిరాన్ చక్రాయుధంతో మాత్రమే మన పాపాలు తీరుతాయి " అని బదులు ఇచ్చారట డ తిరుక్కోట్టియూర్ లో ఉన్నప్పుడు ఈ ఉదంతాన్ని విన్న భట్టర్ తెఱ్ఱ్కాళ్వాన్ కు కల జ్ఞానాన్ని, నమ్మకాన్ని గమనించి వారిని చాలా పొగిడారు.

## 4) శున్దరత్తోళుడైయాన్

### తనియన్

మాలాధరగురోః పుత్రం సౌందర్యభుజదేశికమ్
రామానుజార్యసచ్ఛిష్యం వందే వరకృపానిధిమ్.

వీరు తిరుమాలై ఆణ్డాన్ కుమారులు. వీరికి పెరియాండాన్ అనే పేరు కూడా ఉన్నది. వీరిది కాశ్యప గోత్రం. చైత్రమాసం చిత్రానక్షత్రంలో జన్మించారు. తిరుమాలిరుం శోలై అనే క్షేత్రంలో ఉండే సుందరబాహు స్వామి కోవెలలో పురోహితుడు. వీరి ముత్తాతలలో ఒకరు కణ్ణుక్కినియాన్ అనేవారు వనగిరిలోని సుందరబాహుస్వామిని ఒకానొక సమయంలో ఆపద నుండి రక్షించినందుకుఈ వంశంవారికి ఆండాన్ అనే బిరుదపదం కలిగింది. వీరి వంశంలో యామునాచార్యులు అనే ఒక మహావిద్వాంసులు వాదికేసరి జీయర్ శిష్యులు. యోగశాస్త్రంలో మేధావి.

## 5) పిళ్ళై త్తిరుమలై నంబి

### తనియన్

వృషే విశాఖాసంభూతం రామానుజపదాశ్రితమ్,
శ్రీశైలపూర్ణ సత్పుత్రం శ్రీశైలార్య మహం భజే

వీరు పెరియ తిరుమల నంబి కుమారులు. వైశాఖమాసం విశాఖా నక్షత్రంలో అవతరించారు. వీరికి రామానుజులు అనే సోదరులు ఉన్నారు. వీరి సహోదరి భర్త అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ కుమారులు. శ్రీ అలంకారం వేంగడవర్ అనే, 74 మంది సింహాసనాధిపతులలో ఒకరు. వీరి మేనల్లుడు చాలా ప్రసిద్ధులైన వింజమూరు తాతాచార్యులు.

## 6) నడువిల్ ఆళ్వాన్

### తనియన్

యేన ప్రోల్లసతే నిత్యం గార్గ్యవంశమహాంబుధిమ్
మన్మహే తం సదా చిత్తే మధ్యమార్యం కళానిధిమ్.

వీరు యాదవ వంశానికి పురోహితుడైన గర్గముని వంశానికి చెందినవారు తిరునారాయణ పురంలో శ్రీరామానుజులు ఉండే సమయంలో వీరు రామానుజులవెంటనే

ఉండివారిని సేవించేవారు. వీరు ఒకసారి శ్రీభాష్యం కాలక్షేపం చెప్పిన కాలంలో వంగిపురపురత్తు ఆచ్చి శొట్టై అమ్మాళ్ అనేవారు "ఇది చాలా అద్భుతంగా ఉన్నది" అని అన్నారట, అప్పుడు వారితో వీరు "భగవద్రామానుజుల శ్రీచరణాలే శరణమని భావించండి" అని అన్నారు.

మణవాళ మహామునుల అష్టదిగ్గజాలలో ఒకరైన పరవస్తుపట్రపిరాన్ జీయర్ వీరి వంశానికి చెందినవారు. శ్రీరామానుజుల చివరి దశలో వీరు శ్రీరంగానికి వెళ్లారు. అపుడు రామానుజులు తమను ఆశ్రయించిన "మారుతి ఆండాన్. మాటొన్సిల్లా మారుతి శిటియాండాన్, అరణపురత్తాళ్వాన్, ఆసూరిప్పెరుమాళ్, మునిప్పెరుమాళ్, అమ్మంగి పెరుమాళ్ మొదలైనవారిని వీరిని ఆశ్రయించమని నియమించారు. వీరంతా 74 మంది సింహాసనాధిపతులో చేరినవారే.

వీరి వంశపరంపర ఈవిధంగా ఉన్నది. నడువిల్ ఆళ్వాన్–ఆళ్వాన్– వైత్తమానిది –అళకియ మణవాళర్ –వరదాచార్యర్– వేంకటత్తురైవర్, – శఠకోపాచార్యర్ – పోరేట్రు నాయనార్–, గోవిందాచార్యర్, – కృష్ణమాచార్యర్–, రామానుజాచార్యర్–, గోవిందదాసరప్పర్ అనే పరవస్తు పట్టర్ పిరాన్ జీయర్.

## 7) గోమఠత్తు ఆళ్వాన్

గోమఠత్తు పిళ్ళాన్ అని కూడా వీరికి పేరు ఉన్నది వీరి వద్ద వీరి శిష్యులు కాక్కప్పాడి ఆచ్చాన్ వీరి దగ్గర మూడు సార్లు శ్రీ భాష్యం సేవించారు. వీరి వంశంలో పుట్టినవారే మణవాళ మహా మునులు. వీరి తండ్రిగారు తికళ్ కిడందాన్ తిరునావీఱుడైయ తాతరణ్ణర్. . మణవాళమహామునులకు పూర్వాశ్రమంలో మనుమలు అయిన జీయర్ నాయనార్ కోయిల్. కందాడై అణ్ణన కు కల అష్టదిగ్గజాలలో ఒకరు

## 8) పిళ్ళైప్పిళ్ళై ఆళ్వాన్

వీరు ఉన్నతవంశంలో పుట్టిన ఒక విద్వాంసులు. కూరేశులశిష్యులు. వీరు భాగవతుల వద్ద చాలా సార్లు అపచార పడ్డారు. ఒక పుణ్యతిథినాడు వీరు స్నానం చేసి నదీతీరంలో ఉండే సమయంలో వీరి దగ్గరకు కూరత్తాళ్వార్ వచ్చి " ఈనాడు. పుణ్యదినం. నాకు ఒక దానం ఇవ్వాలి మీరు" అని అడిగారు దానికి వీరు సమ్మతించారు. " మనసుతో, వాక్కుతో, కాయంతో ఏ విధంగానూ ఇకపై భాగవతుల విషయంలో అపచారం చేయను

అని మీరు నాకు మాట ఇవ్వండి" అని కూరేశులు అడిగారు. దానికి పిళ్ళైప్పిళ్ళై ఆళ్వాన్ సమ్మతించారు. అయినా, అలవాటు వల్ల మళ్ళీ ఒక పర్యాయం వీరు భాగవత అపచారాన్ని చేశారు. తాను కూరేశులకు ఇచ్చిన మాటను స్మరించి చాలా విచారించారు. ఇక వారిని చూడడం ఎలాగ? అని బాధ పడ్డారు. అప్పుడు కూరేశులు వీరి సంగతిని తెలుసుకొని, తాను క్షమించానని, ఇకపై ఎటువంటి తప్పు చేయవద్దని ఊరడించారు.

శ్రీ పరాశర భట్టర్ కాలంలో అప్పటి ప్రభువు వీర సుందర బ్రహ్మ రాయుడు వీరి ఇంటిని కూలగొట్టి ప్రాకారాన్ని కట్టాలని ప్రయత్నించాడు. భట్టర్ వద్దని అన్నారు. రాజు భట్టర్ మాటను వినకుండా వీరి ఇంటికి పడగొట్టాడు. అప్పుడు భట్టర్ చాలా మనస్తాపాన్ని పొంది తిరుక్కోట్టియూర్ కు వెళ్ళిపోయారు.

దివ్యప్రబంధవ్యాఖ్యానాలలో వీరికి సంబంధించి ప్రస్తావనలు చాలా కనపడుతున్నాయి. తిరుప్పావై ప్రబంధంలోని ఆరవ పాశురంలో ఉండే "పుళ్ళుం శిలమ్బిన కాణ్ "అనే పదాన్ని వ్యాఖ్యానిస్తూ వీరు "భగవంతుని స్మరించడానికి ప్రాతః కాలంలో పక్షుల ధ్వని మనకు చాలా యుక్తమైనది" అని అన్నారట.

తిరువిరుత్త ప్రబంధం వ్యాఖ్యానంలో "చంటి బిడ్డ తల్లి పాలు తాగి, ఆ తల్లి ముఖాన్ని చూచినట్లు, భక్తులు భగవంతుని చరణాలను పురస్కరించుకొని అతని గుణాలలో, తిరుమేనిలో ప్రీతిని పొందుతున్నారు" అనే వివరణ వీరు మాటిమాటికి చెప్పినట్లు తెలుస్తున్నది.

## 9) ఎఙ్గళాళ్వాన్

### తనియన్

యస్మిన్ పదం యతివరస్య ముఖాత్ ప్రణేతుః
నిష్క్రామతే వనితతే నిగమాంతభాష్యమ్
తస్యైవ తం భగవతః ప్రియభాగినేయమ్
వందే గురుం వరదవిష్ణుపదారవిందమ్

వీరు రామానుజులకు నిత్యం అంతరంగ కైంకర్యం చేసేవారు. కాంచీపురంలో శ్రీవత్స గోత్రంలో వీరు అవతరించారు. వీరికి వరదవిష్ణు అనే పేరు ఉంది. శ్రీరామానుజులు వీరికి శ్రీభాష్యసింహాసనాధిపతి అనే బిరుదు ఇచ్చారు. ఎఙ్గళాళ్వాన్ వీరి శిష్యులు. నడాదూర్

అమ్మాళ్ అనే వాత్స్య వరదులు వీరి మనుమలు. వీరు రామానుజుల సహోదరి కుమారులు. . మానయాథాత్మ్యనిర్ణయం అనే గ్రంథాన్ని వీరు రచించారు. వీరి అర్చావిగ్రహం తిరువెళ్ళరై అనే క్షేత్రంలో ఉన్నది. వీరి దగ్గర పది పన్నెండుమంది శ్రీభాష్యాన్ని సేవించారు.

## 10) ఎజ్ఞళాళ్వాన్

### తనియన్

**శ్రీవిష్ణుచిత్తపదపంకజసంగమాయ**
**చేతో మమ స్పృహయతే కిమతః పరేణ**
**నోచేత్ మమాపి యతిశేఖరభారతీనాం**
**భావః కథం భవితుమర్హతి వాగ్విధేయః**

వీరు తిరువెళ్ళరై క్షేత్రంలో చైత్రమాసం రోహిణి నక్షత్రంలో అవతరించారు. వీరి శిష్యులే నడాదూర్ అమ్మాళ్. శ్రీభాష్య ఉపన్యాసంలో వీరు సమర్థులు. శ్రీవిష్ణుపురాణానికి విష్ణుచిత్తీయం అనే వ్యాఖ్యానాన్ని రచించారు. నంజీయర్ ఆరాధనలోని ఆయర్ దేవు అనే అర్చామూర్తి వీరికి కలలో కనబడి, తనకు నేరేడు పళ్ళు పెట్టమని మాటిమాటికి అడిగాడట, ఆ విషయాన్ని వీరు నంజీయర్ దగ్గర తెలియజేసినట్లు దివ్యప్రబంధ వ్యాఖ్యానంలో తెలుపబడింది.

తిరునారాయణపుర నుండి శ్రీరామానుజులు శ్రీరంగానికి వచ్చిన తర్వాత ఏడెనిమిది సంవత్సరాలకు అనంతరం కూరత్తాళ్వార్కు బదులుగా వీరు శ్రీ భాష్యాన్ని రచించడంలో రామానుజులకు సహాయకులుగా ఉన్నారట. అందువల్ల వీరికి శ్రీరామానుజులు ఎజ్ఞళాళ్వాన్ అనే పేరు పెట్టారట. వీరు శ్రీరామానుజుల కంటే 80 సంవత్సరాలు చిన్నవారు. ప్రమేయ సంగ్రహం, సంగతి మాల, గద్య వ్యాఖ్యానం అనేది వీరి గ్రంథాలు. నంజీయర్, నంబిళ్ళై కాలంలో కూడా వీరు జీవించి ఉన్నారు వీరు తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ దగ్గర దివ్యప్రబంధం కాలక్షేపాన్ని చేశారు. వీరి కుమార్తె శెంగమల నాచ్చియార్. అల్లుడు వరదాచార్యులు.

## 11) మిళకాళ్వాన్

వీరు నివసించే దేశాన్ని పాలించే ప్రభువు పండితులకు ఒక పరీక్ష పెట్టాడు ఆ పరీక్షకు మిళకాళ్వాన్ వెళ్లారు. కానీ ద్వారపాలకులు వారిని అడ్డగించారు. అప్పుడు వీరు "నేను పండితుడను కదా! నన్ను ఎందుకు అడ్డుకుంటున్నారు?" అని ప్రశ్నించగా, వారు "మీరు వైష్ణవులు కదా. అందువల్ల అడ్డుకుంటున్నాము" అని బదులిచ్చారు. ఆ మాట వినగానే మిళకాళ్వాన్ చాలా ఆనందంగా నాట్యం చేశారు. ఎందుకంటే, వైష్ణవులుగా తమను వారు గుర్తించారు కదా.

వీరు విద్వాంసులు అయినందున మొదలియాండాన్ ను వాదానికి ఆహ్వానించారు. ఓడిపోయినవాడు గెలిచిన వానిని భుజాలపై మోయాలి –అనేది నిబంధన. ఆ వాదనలో మిళకాళ్వాన్ ఓడిపోయారు. అందువల్ల వారు ముదలియాండాన్ ను భుజాలపై పెట్టుకొని మోశారు. వారు వీరిని రామానుజులను ఆశ్రయించేటట్లు చేశారు. రామానుజులు కూడా వీరికి తగిన గౌరవాన్ని ఇచ్చి ఆదరించారు.

ఒక పర్యాయం రామానుజులు వీరిని చూచి, "ఏవండీ !మీరు మాటిమాటికి శివుని ఆలయానికి వెళ్తున్నారేమి?"ఎందుకోసం? అని అడిగారు అందుకు వీరు "నేను వారికి భగవంతునకు సంబంధించిన విషయాలను చెప్పడం కోసం వెడతాను వారిని సంస్కరించడంకోసం ప్రయత్నిస్తాను" అని అన్నారట అప్పుడు రామానుజులు "బాగుంది. అయితే మరి, ఎవరైనా మారారా?" అని అడిగారు. అప్పుడు "నేను అందరిని నారాయణసంబంధంతోనే భావిస్తాను. వేరు సంబంధంతో నేను చూడను ఏ వస్తువు అన్య సంబంధంతో ఉండదుకదా!" అని అన్నారట. ఇది వారి జ్ఞానవైభవానికి చిహ్నం.

## 12) ఉక్కలమ్మాళ్

వీరు రామానుజుల మఠంలో వంట పాత్రలను శుద్ధి చేసే కైంకర్యం చేసేవారట.

## 13) కణియనూర్ శిటియాచ్చాన్

వీరు వంగిపురత్తు నంబి శిష్యులు. పోసలదేశంలో నుండి శ్రీరంగానికి వచ్చారు. చాలా సాధువు. గడ్డిపరకను కూడా తుంచి ఎరుగరు. గోదాదేవి నాచ్చియార్ తిరుమొళిలోని "ఇట్టీరిట్టు విళైయాడి" అనే సూక్తిని వీరు చాలా అనుభవించేవారట. అన్నిటికీ సమర్థుడైన

భగవంతుడు తన సౌలభ్యాన్ని చూపి, గోపికలతో గోవులతో, గోపాలురతో ఆనందించడం కోసం జన్మించి ఆవిధంగా వర్తించడం వీరికి చాలా ఆనందాన్ని కలిగించేది మీరు గొప్ప ఆచార వంతులు కూడా శరీరమంతా కాయలు కాచే టట్లు భగవద్ విగ్రహాన్ని వీరు ఆలింగనం చేసుకునేవారు.

వీరి జ్ఞానవైభవాన్ని చూచి కూరేశులు భట్టర్ తో “శిఱుమామనిశర్” అంటే వీరే అని అనేవారట. అంటే, రూపం చిన్నదైనా జ్ఞానంలో పెద్దవారని భావం. వీరు శ్రీరామానుజుల విషయంలో చాలా భక్తిప్రపత్తులను కలవారై, మాటిమాటికి ఈ శ్లోకాన్ని మనసు మననం చేసే వారట. ఆ శ్లోకం ఏమిటంటే– “ సత్యం సత్యం పునః సత్యం యతి రాజో జగద్గురుః, స ఏవ సర్వలోకానాం ఉద్ధర్తా నాస్తి సంశయః” అనేది.

“శ్రీరామునకు ఎన్నో గొప్పతనాలు ఉన్నా శ్రీకృష్ణునివలె తన భక్తుల కోసం దూతగా వెళ్లిన గొప్పతనం లేదు కదా “అని వీరు ఒక పర్యాయం భట్టర్ తో అన్నారట అపుడు భట్టర్” ఆ విధంగా కాదు. శ్రీరామునకు ఏ కొరత లేదు. ఆయన క్షత్రియకులంలో పుట్టినందున, రాముడు రాజ్యం చేసే సమయంలో ఎవరికి ఏ కొరత లేనందున శ్రీరాముని దూతగా పంపించేవారు కానీ, పంపించవలసినవారు కాని లేరు, అంతే” అని అన్నారట

“శ్రీరాముని అందానికి సుబ్రహ్మణ్యుని గాని, మన్మధుని గాని సాటిగా చెప్పరాదు అని వీరు ఒక సందర్భంలో భట్టర్ తో అన్నారట” వాల్మీకి మహర్షి రామాయణంలో శ్రీరామునకు కంటి దోషం తగల రాదు– అనే ఉద్దేశ్యంతో అతని అందాన్ని కొంచెం తక్కువ చేసి “దేవకుమార్ రూపమ్ అని అన్నారు” అని భట్టర్ అప్పుడు బదులు ఇచ్చారట.

## 14) ఆట్కొండవిల్లి జీయర్

### తనియన్

జ్ఞానవైరాగ్యసంపన్నం రామానుజపదాశ్రితమ్,
చతుర్థాశ్రమసంపన్నమ్ సంయమీంద్రం నమామ్యహమ్.

వీరు చైత్ర మాసం ఆర్ద్రా నక్షత్రంలో అవతరించారు. శ్రీరామానుజుల అజ్ఞతో ముదలియాండాన్ కుమారులైన కందాడై ఆండాన్ వీరిని ఆశ్రయించారు.

వీరు ఒక నాడు బయటకు వెళ్లినప్పుడు నంజీయర్ వీరికి దండం పెట్టి, నమస్కరించారు. అపుడు వీరు "ఒకనికి భగవద్ విషయంలో రుచి ఎప్పుడు ఏర్పడినట్లు అంటే, భగవద్భక్తుల దర్శించినపుడు సంతోషం కలిగితే అప్పుడే రుచి ఏర్పడినట్లు" అని అన్నారట.

## 15) తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్

### తనియన్

**సింహే మృగశిరోద్భూతం రామానుజపదాశ్రితమ్,**
**ద్రావిడామ్నాయతత్త్వజ్ఞం కురుకాధిప మాశ్రయే.**

**ద్రావిడామ్నాయసారజ్ఞం రామానుజపదాశ్రితమ్,**
**సుధియం కురుకేశార్యం నమామి శిరసాఽన్వహమ్.**

వీరు శ్రావణ మాసం మృగశిరా నక్షత్రంలో జన్మించారు. వీరు పెరియ తిరుమల నంబి మూడవ కుమారుడు. తిరుమల నంబి వీరిని రామానుజులకు అభిమానపుత్రులుగా ఇచ్చారు. వీరు రామానుజులు దిగ్విజయ యాత్రకు ఆళ్వార్ తిరునగరి కి వెళ్ళినప్పుడు వారితో కూడా వెళ్లారు. శఠకోపులు లోకానికి అనుగ్రహించిన గొప్ప ఉపకారానికి గుర్తుగా ఎవరికైనా వారి పేరును పెట్టాలని తలచినప్పుడు వీరికే ఆ పేరు పెట్టడానికి తగినదని భావించి, " తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్" అనే పేరును పెట్టారు. ఈ పేరు తిను కొట్టే నంబి కూడా ఉన్నది. వారి తిరునామం కూడా వీరికి ఈ విధంగా కలగడంవల్ల పండితులందరూ వీరిని చాలా గౌరవంగా చూసేవారు.

ఈ మహనీయులు శిఖు పుత్తూరు అనే గ్రామంలో ఉన్నప్పుడు సోమాశియాండాన్ అనే ఆచార్యులు వీరి దగ్గర మూడు సార్లు శ్రీ భాష్యాన్ని అధ్యయనం చేశారు. వారు వీరి వద్ద ఒకసారో తనకు రక్ష కంగా ఏదైనా ఒక మాట చెప్పాలి అని అడిగినప్పుడు "మీరు రభాట్ట ప్రాభాకర మీమాంసలను అన్నిటిని చదోవాను. భాష్యాన్ని సేవించాను –అని అహంకరించకండి. భగవద్రామానుజుల చరణాలే శరణం అని భావించండి° అని ఉపదేశించారు.

రామానుజుల ఆజ్ఞను అనుసరించి తిరువాయ్ మొళి ప్రబంధానికి ఆఱాయిరప్పడి అనే ఒక చక్కని వ్యాఖ్యానాన్ని విష్ణుపురాణశ్లోకసంఖ్యలో రచించారు

వీరి దగ్గర ఎంగళాళ్వాన్ దివ్యప్రబంధాల అర్థాలను గ్రహించారు. వీరు రామానుజులకు చరమకైంకర్యాలను చేశారు.

పిళ్ళాన కొంగిల్ నాడు హకు వెళ్ళినప్పుడు శ్రీ వైష్ణవులు ఆచార్యుని తిరునామాలను చెప్పకుండా భగవంతుని తిరునామాలనం అనుసంధానం చేస్తున్నారు. దానిని చూచి వీరు ఆచార్య సంబంధం లేని చోట ఉండరాదని తలచి, ఆ ఇంటిని విడిచి బయటకు వచ్చేశారట. "వళర్ త్తదనాల్ పయన్ పెట్రేన్"– పెంచినందుకు ఫలాన్ని పొందాను– అని శ్రీ రామానుజులు ఆనందించే రీతిలో వీరిపై వారు ప్రేమను కలిగి ఉండేవారు. తమ చివరి కాలంలో " కూవిక్కొళ్ళుమ్ కాలమ్ ఇన్ను మ్ కుఱుకాదో!" భగవంతుడు తన దగ్గరకు నన్ను తీసుకునే కాలం ఇంకా రాలేదా? అని విచారించే సమయంలో, నంజీయర్ ఏడవడం ఆరంభించారట. అప్పుడు పిళ్ళాన్ వారిని చూచి"మీరు ఎందుకు ఏడుస్తున్నారు? నేను అక్కడికి పోయి పొందే ఫలం ఇంతకంటే తక్కువది అని మీరు భావిస్తున్నారా? "అని అన్నారట.

## 16) తిరుక్కణ్ణపురత్తెచ్చాన్

ఒక సమయంలో తిరుక్కణ్ణ పురం ఆలయం చుట్టూ శత్రువులు చుట్టుముట్టారు. అపుడు వీరు తిరుమంగై ఆళ్వార్లు ఆగ్రహించిన " శెరువరై మున్ ఆశఱుత్త శిలైయన్తో కైత్తలత్తు" అన పాశురాన్ని పాడారు. వెంటనే భగవంతుడు "ఇదిగో!ఇప్పుడే ఒక క్షణంలో శత్రువులను సంహరిస్తాను"అన్నాడట.

## 17) అమ్మంగిప్పెరుమాళ్

వీరు రామానుజులకు పాలు కాచే సేవను చేసేవారు.

## 18) మారుతి పెరియాండాన్

వీరు రామానుజుల తీర్థకలశాన్ని మోసేవారు.

## 19) మాఱొన్ఱిల్లా మారుతియాణ్డాన్

తనియన్

జ్ఞాతుం కూరకులాధిపం కృమిగళాత్ ప్రాప్తాపదం ప్రేక్షితః
శ్రీరామావరజేన కోసలపదాత్ దృష్ట్వా తదీయం స్థితిమ్,
సంప్రాప్త స్త్వరయా పురాంతకపురాత్ కల్యాణవాపీతటే
యోసౌ మారుతిరిత్యశంసత స్వయం తస్మై నమస్కుర్మహే.

వీరు రామానుజుల మఠానికి కూరలు, పాలు, నెయ్యి, మొదలైన పదార్థాలను ఏర్పాటు చేసేవారు, శ్రీ రామానుజులు తిరునారాయణపురం వెళ్ళినప్పుడు శ్రీరంగంలో కూరత్తాళ్వాన్, పెరియ నంబి మొదలైనవారి క్షేమం తెలియక చాలా బాధ పడ్డారు. అప్పుడు రామానుజులు మారుతిశిఱియాండాన్ ను వారి క్షేమం తెలియడం కోసంఅ శ్రీరంగానికి పంపించారు వీరు కూడా అక్కడికి వెళ్లి వివరాలను తెలుసుకొని, పెరియ నంబి పరమపదించారని, కూరేశులు నేత్రాలను పోగొట్టుకున్నారని శ్రీరామానుజులకు తెలిపారు

## 20) శోమాశియాండాన్

తనియన్

నౌమి లక్ష్మణయోగీంద్రపాదసేవైకధారకమ్,
శ్రీరామక్రతుతాతార్యం శ్రీభాష్యామృతసాగరమ్.

వీరు చైత్ర మాసం ఆరుద్ర నక్షత్రంలొ జన్మిఃచారు. వీరి నిజనామం రామమిశ్రులు. వీరు సోమయాగం చేసినందున సోమాశియండాన్ అనే పేరు వచ్చింది. 'ఎంబెరుమానారే శరణం' అని పలుకడం వీరికి చాలా ప్రీతి.

వీరు తిరునారా యణ పురంలోని శెల్వపిళ్ళైస్వామికి చాలా అంతరంగులు. వారితో పాట పాడి ఆనందించేవారు. ఒక నాడు వీరు "నాకు మోక్షం ఉందా?" అని శెల్వపిళ్ళైను అడిగారు " మీకు లేదు" అని స్వామి బదులిచ్చాడు. " అదేమి? నేను నిన్ను పాట పాడి ఆనందింప చేస్తున్నాను కదా" అని అడిగారు సోమాశియాండాన్. " మీరు పాడినందుకు నేను ఆడినందుకు సరిపోయింది, శ్రీరామానుజుల అభిమాన పొందకపోతే మోక్షం సిద్ధించదు దానికి ప్రయత్నించండి" అని స్వామి అన్నాడు. అప్పటినుండి

రామమిశ్రులు శ్రీ రామానుజుల విషయంలో చాలా అభిమానాన్ని కలిగినవారు ఉండేవారు. శ్రీరంగంలో వీరి కులానికి చెందినవారే వాక్యపంచాంగం మిరాశి అధికారాన్ని కలిగి ఉన్నారు. వీరు శ్రీభాష్యవివరణం, గురుగుణావళి అనే గ్రంథాలను రచించారు.

## 21) శిఠియాండాన్

వీరు, మాటొన్టిల్లా మారుతియాండాన్తోపాటు తిరు నారాయణపురం నుండి రంగానికి వెళ్లి కూరత్తాళ్వార్ మొదలైనవారి క్షేమాన్ని తెలిసికొని వచ్చారు.

## 22) తొండనూర్ నంబి

వీరు కర్ణాటక దేశంలోని తొండనూరుకు చెందినవారు. భాగవతులకు సేవ చేయడమే ప్రధానమైన కర్తవ్యంగా కలవారు. ఒకనాడు ఒక శివభక్తుడు ప్రతి వీధిలోనూ తిరిగి భిక్షను అడిగాడు. అయినా అతనికి ఎక్కడా భిక్ష దొరకలేదు. ఒకరు అతనితో" నీవు తొఇండనూర్ నంబి ఇంటికి వెళ్లి "శ్రీమతే రామానుజాయ నమః" అని చెప్పు. వారు నీకు భిక్ష పెడతారు" అని అన్నాడు, శివ భక్తుడు కూడా ఆ విధంగానే నంబి ఇంటికి వెళ్లి "శ్రీమతే రామానుజాయ నమః" అని అంటూ భిక్షను అడిగాడు. నంబి బయటకు వచ్చి "నీవు శివభక్తుడు కదా! మరి రామానుజులవారి పేరు చెప్తున్నావే! ఏమి కారణం?" అని అడిగాడు. అతడు జరిగిన వృత్తాంతాన్ని తెలియజేసి భిక్షను ప్రార్థించాడు. నంబి భిక్షను అతనికి పెట్టారు. అందువల్ల కొంతమంది "నీవు శివ భక్తునకు భిక్ష పెట్టావు గనుక నీవు చేసినది తగినది కాదు" అని నిందించారు, అప్పుడు నంబి వారితో ఆచార్య నామమహిమను గురించి వివరించారు. వారు కూడా నంబి మాటలకు సమ్మతించి వెళ్ళిపోయారు. ఆ శివ భక్తుడుకూడా తరువాత నంబికి అంతరంగ భక్తుడై వారిని సేవించాడు.

"తిరుక్కోట్టియూర్ లోని శెల్వనంబిదంపతులవలె తొండనూర్ నంబికూడా భాగవతశేషత్వమే జీవనయాత్ర గా కలిగినవారు" అని తిరువాయ్ మొళి 8–10–11 వ పాశుర వ్యాఖ్యానంలో చెప్పబడింది.

నంబి అనంతార్యులతో కలసి శ్రీరంగానికి రంగానికి వెళ్లి రామానుజులను కలిశారు. రామానుజులు వారిని యజ్ఞమూర్తిని(అరుళాళ ప్పెరుమాళ్ ఎంబెరుమానార్ ను ఆశ్రయించేటట్లు చేశా .

నంబి రామానుజుల దగ్గరకు ఆ దేశప్రభువు విట్టల దేవరాయలను తీసికోనిపోయి, అతని కూతురుకి పట్టిన పిశాచాన్ని రామానుజుద్వారా పారద్రోలలించారు. ఆ రాజు రామానుజులను ఆశ్రయించేచేటట్లం చేశారు.

## 23) మరుదూర్ నంబి

వీరు మైసూర్ ప్రాంతానికి చెందినవారు. అనంతార్యులతో కలసి శ్రీరంగానికి వెళ్లి, యజ్ఞమూర్తిని ఆశ్రయించారు.

## 24) మళువూర్ నంబి

వీరు కూడా మైసూర్ ప్రాంతానికి చెందిన వారే. అనంతార్యులతో కలసి శ్రీరంగానికి వెళ్లి యజ్ఞ మూర్తిని ఆశ్రయించారు.

## 25) ముండుంబై నంబి

తనియన్

శ్రీరామానుజసంయమీంద్రశరణం శ్రీవత్సచిహ్న ప్రియం
సేవేహం వరదార్యనామకమముం సూక్త్యా ప్రసిద్ధం ముదా,
అబాల్యాత్పరిపూర్ణబోధశఠజిత్ గాథాసు రాగోజ్జ్వలం
వాత్స్యం పూర్ణముదార మాశ్రితనిధిం వాత్సల్యరత్నాకరమ్.

శ్రీరామానుజయోగీంద్రపదపంకజషట్పదమ్.
ముడుంబైపూర్ణమనఘం వందే వాత్స్యం గురూత్తమమ్.

కాంచీపురానికి సమీపంలో ఉండే ముడుంబై అనే అగ్రహారంలో శ్రీవత్స గోత్రంలో అవతరించారు. వీరి నిజమైన పేరు వరదాచార్యులు వీరు రామానుజుల సోదరికి భర్త. రామానుజులను ఆశ్రయించారు. కూరేశుల ప్రేమకు పొందారు. గొప్ప జ్ఞానాన్ని. ఆచారాన్ని కలవారు.

వీరి కుమారులు రామానుజనంబి. వీరి కుమారులు ముడుంబై ఆండాన్ అనే దాశరధి. వీరు ముడుంబైనుండి శ్రీరంగానికి వలస వచ్చారు. వీరి వంశ పరంపర ఈ విధంగా ఉన్నది.

దాశరథి కుమారులు దేవ ప్పెరుమాళ్ అనే వరదాచార్యులు. వీరికి ఇళైయాళ్వార్ అనే పేరు గల లక్ష్మణాచార్యులు అనే పుత్రులు కలిగారు ఈ లక్ష్మణాచార్యులకు వరదాచార్యులు, శ్రీ కృష్ణపాదులు(వడక్కుత్తిరువీథిప్పిళ్ళై) అని ఇద్దరు కుమారులు. వరదాచార్యులు రామానుజ గురువు అనే పుత్రులు కలిగారు. వారికి అళకప్పంగార్ అనే పుత్రులు, వారికి దేవరాజగురువు(పేరరుళాళస్వామి) అనే పుత్రులు కలిగారు. దేవరాజగురువుకు పుత్రులు రామానుజప్పిళ్ళై(మణవాళ మహాముునుల శిష్యులు) వీరే వానమామలై జీయర్ అష్టదిగ్గజాలలో ఒకరు.

శ్రీకృష్ణపాదులకు పిళ్ళై లోకాచార్యుల వారు, అళకియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ అని ఇద్దరు పుత్రులు.

ప్రతివాది భయంకర అణ్ణన్ వంశానికి చెందిన వారు అందరూ ముడుఃబై వంశీయులే. ఆళ్వార్ తిరునగరి కీళ్ తిరుమాళిగ, మేల్ తిరుమాళిగ, వడక్కు తిరుమాళిగకు చెందిన ఆచార్యులు ఈ వంశానికి చెందినవారే.

## 26) వడుకనంబి

### తనియన్

చైత్రేశ్వనిసంజాతం సంసారార్ణవతారకమ్
రామానుజార్యసచ్ఛిష్య. మాంధ్రపూర్ణమహం భజే.

రామానుజార్యసచ్ఛిష్యం సాలగ్రామనివాసినమ్,
పంచమోపాయసంపన్న మాంధ్రపూర్ణమహం భజే

వీరు క్రీస్తు శకం 10 10 47 చైత్రమాసం అశ్వినీ నక్షత్రంలో తిరునారాయణ పురం దగ్గరలో ఉండే సాలగ్రామం అనే ఊరిలో జన్మించారు. వీరికి ఆంధ్ర పూర్ణులు అనే ఇంకొక పేరు ఉన్నది. రామానుజులకు పాలు కాచి సమర్పించే కైంకర్యం చేసేవారు. ఒక నాడు రాత్రి శ్రీరంగనాథుడు వీథిలోకి వేంచేశాడు. శ్రీరామానుజులు తమ మఠం వాకిలి లోకి భగవానుడు వేంచేసేటప్పుడు సేవించడానికి వెళ్లారు. అప్పుడు వారు వడుగ నంబిని కూడా పిలిచారు. “నాకు మీరే భగవంతుడు. మీకోసం పాలు కాస్తున్నాను. నేను వస్తే పాలు పొంగి

పోతాయి. అందువల్ల నేను శ్రీరంగనాధుని సేవించడానికి రాలేను" అని నంబి అన్నారట హ. "రామానుజులు తప్ప వేరొక దైవం లేదు" అనే నిశ్చయం కలిగినవారు వీరు.

కూరత్తాళ్వార్కు, మొదలియాండాన్ కు భగవంతుని విషయంలో, ఆ విధంగానే, రామానుజుల విషయంలో –ఇద్దరి విషయం లో అభినివేశం ఉండేది. కానీ, తమకు రామానుజుల విషయంలోనే అభినివేశం ఉన్నందున కూరత్తాళ్వార్ ను మొదలి యాండాన్ ను వడుగునంబి "ఇరుకరైయర్"అని అనేవారట.

వీరు సర్వదా శ్రీరామానుజుల పాదుకలను సేవిస్తూ, వారు బయటకు వెళ్లే సమయంలో పాదుకలను తీసుకొని సిద్ధంగా ఉండేవారు. శ్రీరామానుజులకు అభ్యంగన కైంకర్యం కూడా వీరే చేసేవారు. ప్రతిరోజు రాత్రి శ్రీరామానుజు పాలను స్వీకరించేటప్పుడు వారి వద్ద దివ్యప్రబంధాలను చెప్పుకునేవారు.

ఒకానొక సమయంలో ఒక శ్రీవైష్ణవుడు వీరి పక్కన ఉన్నప్పుడు అతడు "ఓం నమో నారాయణాయ "అనే మంత్రాన్ని చెప్పాడట అపుడు "అయ్యో! నీవు శ్రీమతే రామానుజాయ నమః అని చెప్పలేదే" అని అంటూ అక్కడ నుండి లేచి బయటకు వచ్చేశారట, వడుగ నంబి.

మీరు శ్రీ రామానుజుల పాదుకలకే ఆరాధన చేసేవారు. ఒక నాడు యాత్రకు బయలుదేరే టప్పుడు వీరు శ్రీరరామానుజుల ఆరాధనలోని అర్చామూర్తిని, శ్రీరామానుజుల పాదుకలను ఒకటిగా చేర్చి తీసుకొని వచ్చారు. దీనిని చూసిన శ్రీరామానుజులు "నంబీ! ఈ విధంగా చేశావేమి? భగవంతుని మూర్తి తో ఈ పాదుకలను ఒకటి చేయవచ్చునా?" అని అడిగారు నంబి అప్పుడు "మీ పెరుమాళ్ళ కంటే నా పశేన పెరుమాళ్ళకు ఏమి తక్కువ?" అని అన్నారట. ఇంతటి ఆచార్య భక్తి వీరిది.

రామానుజులు కోవెలకి వెళ్లి భగవంతుని సేవించేటపుడు నంబిని పిలచి, "నంబీ! భగవంతుని నేత్రసౌందర్యాన్ని చూడు" అని అన్నారట. అపుడు వీరు" ఎన్నముదినై క్కండ కణ్గళ్ మట్రొన్ఱినై క్కాణావే" (నా అమృతాన్ని దర్శించిన నా కన్నులు వేరొక వస్తువును దర్శిస్తాయా?) అని అన్నారట. వీరి ఒడిలో తల పెట్టుకొని రామానుజుల నిద్రించేవారు.

రామానుజాష్టోత్తర శతనామ స్తోత్రం, యతి రాజవైభవం, యతిరాజమంగళం అనే గ్రంథాలను వీరు రచించారు. " వడుగ నంబి తిరు నాట్టుకు వెళ్లారు" అని ఒకరి చెప్పగా విన్న అరుళాళప్పెరుమాళ ఎంబెరుమానార్ " మీరు రామానుజుల శ్రీచరణాలను చేరారు అని కదా చెప్పాలి "అని అన్నారు.

## 27) వంగిపురత్తునంబి

### తనియన్

**భారద్వాజకులోద్భూతం లక్ష్మణార్యపదాశ్రితమ్**
**వందే వంగిపురాధీశం సంపూర్ణార్యం కృపానిధిమ్.**

వంగిపురత్తు నంబి తిరువాయ్ మొళి ప్రబంధానికి సారంగా అర్థ పంచకం అనే గ్రంథాన్ని రచించారు. లక్ష్మికి నాథుడు అనేదే భగవానునకు కల గొప్పదనం శ్రీవైష్ణవ మతానికి ఉండే గొప్పతనం కూడా అదే" అని వీరు అనేవారు.

తమకు భగవదారాధన క్రమాన్ని తెలుపవలసినదిగా శ్రీరామానుజులను వీరు చాలా సార్లు అడిగారు. కానీ రామానుజులు ఆ క్రమాన్ని చెప్పడంలో ఆలస్యం చేశారు. ఒక నాడు శ్రీరామానుజులు తిరుమల కొండపై ఒక భక్తుడు అడుగగా భగవదారాధన క్రమాన్ని తెలియజేశారు. ఆ సమయంలో నంబి అక్కడకు వచ్చారు. ఇంతకాలంగా వారు అడిగినప్పటికీ తాము ఆరాధన క్రమాన్ని చెప్పలేదే ! అనే సంకోచం రామానుజులకు కలిగిందట. తమ మనస్సులో కలిగిన సంకోచాన్ని శ్రీరామానుజులు నంబి దగ్గర చెప్పి బాధ పడ్డారు.

భగవంతుడే నమ్మాళ్వారుగా అవతరించారు– అని వీరి భావం.

ఒకానొక సమయంలో వీథిలోకి శ్రీరంగనాథుడు వేంచేశాడు. అప్పుడు నంబి స్త్రీలు నిలుచున్న పక్కకు వెళ్లి వారితో నిలిచారు. స్త్రీలు భగవంతుని ఉద్దేశించి, " పాలు స్వీకరించు. ఫలాలను స్వీకరించు" అని తమిళంలో అన్నారు. వారి పక్కనే ఉండే నంబి తమ అలవాటు ప్రకారం " విజయీభవ విజయీభవ "అని సంస్కృతంలో అన్నారు. . ఈ విషయాన్ని తెలిసిన ముదలియాండాన్ వీరితో "అక్కడకు వెళ్ళినా మీరు పలికేది మొరటు సంస్కృత మేనా? మనం ఎక్కడికి వెళ్ళినా మనం మనమే. వారు వారే" అని అంటూ గోపికల కృష్ణభక్తిని మెచ్చుకున్నారట.

శ్రీ రామానుజులు, నంబి కలిసి ఉండే సమయంలో శ్రీరామానుజులను సేవించాలని వచ్చినవారి దగ్గర విషయం విచారణకు వచ్చింది. అపుడు " మనకు రక్ష కంగా భావింపబడేది క్షత్రబంధు వృత్తాంతం" అని నంబి అన్నారట. "కాదు, కాళీయుని వార్త" అని రామానుజులు అన్నారట. ' క్షత్రబంధువు "నిన్ను సేవించే నన్ను అనుగ్రహించాలి"అని అన్నాడు. కాని, కాళీయుడు ఏమన్నాడంటే "నిన్ను సేవించడం తెలియని నన్ను రక్షించాలి" అని అన్నాడు, కాళీయుని మాటలో భగవంతుని నిర్హేతుక కృపావైభవం తెలుపబడినందున మనకు రక్ష కం అదే" అని అన్నారట.

వీరు మణక్కాల నంబి శిష్యులైన వంగిపురత్తాచ్చి కుమారులు. 74 మంది సింహాసనాధిపతులలో ఒకరైన ఫ శిఱియాత్తాన్ వీరి శిష్యులే.

## 28) పరాంకుశనంబి

### తనియన్

**గోవిందరాజాన్వయజో మనీషీ పరాఃకుశో యామునవైమనస్యమ్,**
**అపాచకార ప్రసభం తృతీయం విరాజతే వృద్ధమణిప్రదీపః**

వీరు శ్రీరామానుజులకు తమ్ముడైన శిఱియగోవింద భట్టర్ కుమారుడు. వీరి కుమారుడు కూరనారాయణ జీయర్ పరాశర భట్టర్ శిష్యులు. పరాంకుశ నంబి జన్మించినపుడు రామానుజులు ఎంబార్ తో "ఈ బిడ్డకు నమ్మాళ్వారుల పేరు పెట్టండి" అని అన్నారు. దానివల్ల వీరికి ఈ పేరు పెట్టబడింది. తమిళంలో గొప్ప పండితులయిన వీరిని కూరత్తాళ్వాన్ "పాలేయ్ తమిళర్" అని ప్రశంసించేవారట.

## 29) అమ్మంగి అమ్మాళ్

ఒకానొక సమయంలో నంబిళ్ళైకు అనారోగ్యం కలిగింది. అప్పుడు అమ్మంగి అమ్మాళ్ మంత్రించిన ఒక యంత్రాన్ని నంబికి ఇవ్వబోయారు. కానీ నంబిళ్ళై దానిని తీసుకోలేదు.

శ్రీ రామానుజులు తిరునారాయణపురం వెళ్ళినప్పుడు శ్రీరంగంలో పెరియ నంబి, కూరేశులు అనే వీరి క్షేమం తెలియడంకోసం రామానుజులు మాఱొన్టిల్లా మారుతి ఆండాన్ తో పాటు వీరినికూడా పంపించారు.

వీరు చక్కగా పాడి అందరిని ఆనందింపజేసేవారు. వీరు చరమదశలో ఉండేటప్పుడు వీరు పడే బాధను చూచి నంజీయర్ చాలా బాధ పడ్డారు. అపుడు వీరు పెరియ తిరుమొళి ప్రబంధంలోని 3-6-9 పాశురాన్ని చెప్పి" నీ యాళ వళైయాళమాట్టోమే" అని అన్నారు. అప్పుడు వీరి పక్కనే ఉండేది నంజీయర్, నంబిళ్ళై వీరి నమ్మికను చూసి ఆశ్చర్యపడి ప్రశంసించారు. వీరు ఆళ్వారుల పలు పాశురాలకు చక్కని వివరణను అనుగ్రహించారు.

## 30) పరుత్తిక్కొల్లైయమ్మాళ్

శ్రీ రామానుజులు తిరుమలకు వెళ్ళినప్పుడు దారిలో తిరుక్కోవలూరుకు వెళ్లి, అక్కడ నుండి కాంచీపురానికి వెళ్లారు. అక్కడ ఒక చోట దారి రెండుగా చీలింది. ఆ రెండు దారులు ఎక్కడికి వెళ్తాయి ?అని అక్కడ ఉండే గొల్లలను రామానుజులు అడిగారు. వారు" ఒకటి రాజసులైన ఎచ్చాన్ ఇంటికి వెళుతుంది. ఇంకొకటి సాత్వికులు అయిన పరుత్తి క్కొల్లైఅమ్మాళ్ ఇంటికి వెడుతుంది- అని అన్నారు.

రామానుజులు సాత్వికులు అయిన అమ్మాళ్ ఇంటికి వెళ్లారు. ఇంటిలో అప్పుడు అమ్మాళ్ లేరు. వారి పత్ని సరి అయిన వస్త్రాన్ని ధరించలేని దారిద్ర్య స్థితిలో ఉన్నది. ఆమె చినిగిన బట్టలు కట్టుకుని ఉన్నందున బయటకు వచ్చి రామానుజులకు నమస్కరించలేకపోయింది. ఈ విషయాన్ని తెలిసికొన్న రామానుజులు తమ ఉత్తరీయాన్ని తీసి ఇంటి లోపలకి విసిరారు. అమ్మాళ్ పత్ని దానినీ కట్టుకొని బయటకు వచ్చి రామానుజులకు నమస్కరించింది. రామానుజులు ఆమెను తమ కోసం వంట చేయమని చెప్పారు. ఆమె ఆ విధంగానే వంట చేసింది. ఆమె భర్త ఇంతలో గా ఇంటికి వచ్చి, రామానుజులకు నమస్కరించి వినయంగా శ్రీపాదతీర్థాన్ని గ్రహించి, వారికి ఎంతో గౌరవంతో ఆతిథ్యాన్ని ఇచ్చారు. శ్రీ రామానుజులు వారి జ్ఞాన భక్తి వైరాగ్యాలను చూచి ఆనందించి, వారితో అందరితో కలసి భుజించారు.

వీరి పత్ని విషయంలో చెడుగా ప్రవర్తించిన ఒక వైశ్యుని శ్రీరామానుజులు తమ శ్రీపాద తీర్థాన్ని ఇవ్వడం ద్వారా సంస్కరించారట.

## 31) ఉక్కలమ్మాళ్

వీరు రామానుజులకు ఆలవట్ట కైంకర్యాన్ని చేసేవారు.

## 32) శొట్టైయమ్మార్

వీరు తిరునారాయణ పుర లో శ్రీరామానుజ సమక్షంలో నడువిల్ ఆళ్వాన్ దగ్గర శ్రీభాష్యాన్ని విన్నారు. వీరితో వంగిపురత్తు ఆచ్చి కూడా శ్రీ భాష్యం విని ఆనందించారు. ఆళ్వాన్ వీరిని ఆశీర్వదించి" భగవద్రామానుజుల శ్రీచరణాలే శరణం అని భావించండి" అని బోధించారు.

## 33) కిడాంబి ప్పెరుమాళ్

వీరు కిడాంబి అచ్చాన్ తో కలసి రామానుజుల మఠంలో పాచక కైంకర్యానికి చేసేవారు. వీరు పాకశాస్త్రంలో సిద్ధహస్తులు.

శ్రీ రామానుజులు శ్రీ భాష్యాన్ని రచించి పూర్తిచేసిన తరువాత, వీరిని, కిడాంబి ఆచ్చాన్ ను శ్రీ భాష్యకోశంతో పాటు కాశ్మీర దేశానికి పంపిం, అక్కడ శారదా పీఠంలో ఆ గ్రంథాన్ని సమర్పింప జేసి అంగీకారం పొందేటట్లు చేశారు.

## 34) ఈచ్చంబాడి ఆచ్చాన్

ఈచ్చం బాడీ అనే అగ్రహారం తిరుమలకు దగ్గరలో ఉన్నది. వీరి తండ్రిగారు సుందర దేశికులు. వీరికే ఆళకప్పంగార్ అని కూడా పేరు. వీరి తల్లి తిరుమల నంబి కుమార్తె. ఇద్దరూ శ్రీయామునుల ఆజ్ఞానుసారం తిరుమలలో సేవలు చేసేవారు. . రామానుజులు తిరుమలకు వచ్చినపుడు వారికి సుందర దేశికులు తాపనీయ ఉపనిషత్, నృసింహ మంత్రం అనే వీటిని ఉపదేశించారు. తిరుమలలోని వేంటేశ్వరునకు సేవ చేసే కాలంలో సుందర దేశికులకు క్రీస్తుపూర్వం 1026 వ సం. పుష్య మాసం హస్తా నక్షత్రంలో ఒక శిశువు జన్మించింది. ఆ శిశువుకు ఆచ్చాన్ శ్రీనివాసాచార్యులు అనే పేరు పెట్టబడింది. తర్వాత వీరికి చౌలం, ఉపనయనం, వివాహం జరిగాయి ఆ తరువాత వీరి తండ్రిగారు సుందర దేశికుల అజ్ఞానుసారం వీరు రామానుజులను ఆశ్రయించారు. వారి దగ్గర అన్ని శాస్త్రాలను గ్రహించారు. పుత్రపౌత్రష్యులతో దర్శనప్రచారం చేస్తూ వచ్చారు.

వాళిత్తిరునామమ్

ఆనితనిల్ ఓణత్తిల్ అవతరిత్తాన్ వాళియే
వేఃగడత్తై ప్పదియాక విరుమ్బుమవన్ వాళియే
పూవార్ న్ద కళల్ కళైయే పోట్రుమవన్ వాళియే

పదిన్ మర్ కలై ఉట్పొరులై పకరుమవన్ వాళియే
అనవరతమ్ అరియురువన్ అడి తొళువోన్ వాళియే
ఎప్పొళుదుమ్ యతిపతియై ఏత్తుంమవన్ వాళియే
ముత్త తరుమ్ మున్నాలుమ్ ముక్కోలుమ్ వాళియే
ఎళిల్ ఈచ్చుంబాడి ఉఢై జీయర్ తాళ్ వాళియే.

## 36) కారాంజి జీయర్

వీరు శ్రీరామానుజులను ఆశ్రయించారు. రామానుజులు ఉండే చోటికి వెళ్లి వారి కైంకర్యం చేయడానికి వీరిi భార్య అవకాశం ఇవ్వనందున తాము ఉండే చోటనే రామానుజుల విగ్రహాన్ని నిర్మించుకుని ఆరాధన చేయడం ఆరంభించారు. ఆ విగ్రహం సరిగా రానందున దానిని పగులగొట్టి ఇంకొక విగ్రహాన్ని చేశారు. ఒకనాడు రాత్రి కలలో వీరికి రామానుజులు కనిపించి "ఎందుకు ఈ విధంగా విగ్రహాన్ని పగలగొట్టారు?" అని అడిగారు సోమయాజి నిద్రలేచి నేరుగా శ్రీరంగానికి బయలుదేరి వెళ్లి శ్రీరామానుజులకు నమస్కరించి వారికి జరిగిన విషయాన్ని చెప్పారు. రామానుజులు అప్పుడు చిరునవ్వు నవ్వి అభయమిచ్చి వీరి భయాన్ని తీర్చారు.

## 37) ఆసూరిప్పెరుమాళ్

వీరికి ఆసూరి దేవర్, ఆసూరి పుండరీకాక్షులు అనే పేర్లు కూడా ఉన్నాయి. వీరు హారిత గోత్రానికి చెందినవారు. 74 మంది సింహాసనాధిపతులలో ఒకరైన నడువిల్ ఆళ్వాన్ శిష్యులు. శ్రీరామానుజుల ఆరు ఉపదేశాలలో నాలుగవ ఉపదేశం అయిన తిరునారాయణ పుర వాసాన్ని ఆదరించి, అక్కడకు వెళ్లి నివాసం చేస్తూ, సంప్రదాయ దర్శన ప్రచారాన్ని చేశారు. వీరి వంశంలో అవతరించిన ఆయ్ అనే ఆచార్యులు మణవాళ మహాముని కాలంలో ప్రసిద్ధి చెందిన విద్వాంసులు. ఆయ్ ఆచార్య హృదయానికి వాఖ్యను రచించారు.

## 38) అలంకార వేంగడవర్

తనియన్

శ్రీమద్దయాపాలమునే స్తనూజం తత్పాలసేవాధిగతప్రబోధమ్
శ్రీమద్యతీంద్రాంఘ్రినివిష్టచిత్తమ్ శ్రీకౌశికం వేంకటసూరిమీడే.

శ్రీరామానుజపాదపద్మయుగళం సంస్మృత్య సద్గోష్ఠిషు
ప్రేమ్ణాలంకృతవేంకటేశగురు ఇత్యాఖ్యాం పరాం ప్రాప్తవాన్
యోసౌ కౌశికదేశికో గుణనిధిః శ్రీవింజపుర్యాం స్థితః
తత్పాదాబ్జయుగం నమామి సతతం సంసారసంతారకమ్.

వాళి త్తిరునామమ్.

తిరు మరువుమ్ వింజైనగర్ శెళిక్క వందోన్ వాళియే
శ్రీపాడియకారరడిశేర న్దుయ్ న్దోన్ వాళియే
అరుళాళ మామునివనరుళ్ మైన్దన్ వాళియే
అరు మఱైనూల్ మాఱనురై ఆయ్ న్దురైప్పోన్ వాళియే
మరుళిల్ తిరుమలైనంబి మణవాళన్ వాళియే
మొర్ కళియిల్ ఆదిరైనాళ్ భకిళ్ న్దుదిత్తోన్ వాళియే
తిరువరంగర్ తాళిణైయోన్డమ్పకర్ వోన్ వాళియే
తిరువేంగడారియన్ తిరువడికళ్ వాళియే

మీరు అరుళాళ పెరుమాళ్ ఎంబెరు మానార్ పుత్రంలు. వీరిది కౌశిక గోత్రం. మీరు మార్గశిర మాసం ఆర్ద్రా నక్షత్రంలో పుట్టారు. శ్రీరామానుజులను ఆశ్రయించారు 74 మంది సింహాసనాధిపతులలో ఒకరు.

శ్రీరామానుజుల మేనమామ అయిన పెరియ తిరుమలనంబి కుమార్తె ను వీరు వివాహమాడారు. వీరి కుమారులే తరువాతి కాలంలో వింజమూరు తాతాచార్యులు అని పేరు పొందిన గొప్ప విద్వాంసులు.